ప్రచురణ - 1

# శ్రీ ప్రమేయ నవమాలిక

( అణు మధ్వవిజయము - తాత్పర్య సహితము )

## శ్రీ మధ్వ నామావళి



ద్రవ్య సహాయకులు

శ్రీ శేడింబి రామచంద్రరావుపంతులుగారు

బృందావనపుర మాధ్వ యువజన సంఘము

( బృందావనపుర మాధ్వసంఘ కార్యనిర్వాహకవర్గము )

మచిలీపట్టణము

వెల : 0-50 పైసలు ( పోస్టేజి అదనము )

శ్రీ గురుభ్యో నమః

# మనవి

శ్రీమత్సుమధ్వవిజయ మను పేర ప్రసిద్ధి నొందిన ప్రమేయ నవమాలికా గ్రంథమును రచించిన కవివర్యులు శ్రీనారాయణ పండితాచార్యులు. వీరు కవికుల తిలకులగు శ్రీమత్త్రివిక్రమ పండితాచార్యుల వారి పుత్రులు. నారాయణపండితాచార్యులవారు మొదట 'సుమధ్వ విజయ' మను పేర ద్వైతమతోద్ధారకులైన శ్రీమదానందతీర్థ భగవత్పాదుల చరిత్రను సవివరముగా పదునారు సర్గల గ్రంథరాజమును రచించియుండిరి. అయ్యది అనేక కార్యవ్యగ్రులగు తద్భక్తులకు ప్రతిదినము పారాయణము చేసికొనుటకు వీలుగానుండవలె నను అభిలాషతో నారాయణ పండితాచార్యులవారే ఆ గ్రంథమందలి సమస్త విషయమును 'ప్రమేయ నవమాలిక' యందు ముప్పదిరెండు శ్లోకములతో సంగ్రహపరచిరి. కేవల పారాయణము మాత్రమే గాక అందలి విషయముగూడ అర్థము కావలెనను ఉద్దేశముతో ప్రతిశ్లోకమునకు భావమునుగూడ యథాశక్తి పొందు పఱచితిమి.

గురుచరితముతోపాటు గురునామస్మరణముగూడ అత్యంతావశ్యక మని భావించి 'మధ్వనామావళి' అను గ్రంథమునుగూడ ప్రచురించుచున్నాము. దీని రచయిత శ్రీ బిదరహళ్ళి శ్రీనివాసతీర్థాభిధులు.

ఈగ్రంథము మా సంఘముయొక్క ప్రథమ ప్రచురణము. ఇట్లే మాధ్వులకు అత్యంతావశ్యకములు, అలభ్యములు నగు కొన్నిటిని ప్రచురింప నుత్సాహపడుచున్నాము. ఈ పవిత్రకార్యమునకు మాధ్వమతాభిమాను లెల్లరు సహకరింపగలరని ఆశించుచున్నాము. ప్రస్తుతగ్రంథముద్రణకై శ్రీ కేడింబి రామచంద్రరావుపంతులుగారు మాయం దభిమానముచే చేసిన ద్రవ్యసహాయమునకు మాసంఘము వారి కెంతయు కృతజ్ఞతతో నుండగలదు. గ్రంథమున నేవియైన దోషములున్నచో నవి మా అజ్ఞత వలన నేర్పడినవిగా సహృదయులగు మా అభిమానులు భావింపగలరని విశ్వసించుచున్నాము.

—బృందావనపుర మాధ్వ యువజన సంఘము

ACKNOWLEDGEMENT

The illustrious son of Sri Trivikrama Panditacharya, Sri Narayana Panditacharya, has written Srimadanu Madhwa Vijaya containing 33 slokas wherein he described the life of Sri Madhwacharya briefly.

Sri Madhwa Namavali comprises of 60 slokas containing the various names of Sri Madhwacharya collected from "Sumadhwava Vijaya" written by Sri Narayana Panditacharya. The recital of the names is held highly efficacious in securing devotion which is essential for getting the Grace of the Lord. The name is the verbal incarnation of the Lord. The Nama Sankirtan is described as the best in Kaliyuga.

Sri. Kasi Narasimhamurty. M. A., the worthy grandson of Vidya Varidhi, Avadhani Siromani, Asthana Kavi of the Andhra Pradesh State, and Madhwa Sastra Sampannulu late Sri Kasi Krishnacharya garu, has been kind enough to write "Tatparyam" to each sloka of Srimadanu Madhwa Vajaya. He also looked to proof reading laboriously. I am much thankful to him for the service done.

My thanks are also due to The Triveni Publishers for printing this book in record time in a neat and beautiful manner.

MACHILIPATNAM }
6-7-1973 }

S. RAMACHENDRA RAO

Released on the occasion of
Sri Pancha Mukhi Anjaneya Japa Stotram
on 9th July 1973

Dedicated to respected late father

Rao Bahadur

SEDIMBI HANUMANTHA RAO PANTULU GARU

and

Grandfather

Late RAGHAVENDRARAO PANTULU GARU

by

SEDIMBI RAMACHENDRA RAO

శ్రీ లక్ష్మీ హయగ్రీవో విజయతే తరామ్

# శ్రీ ప్రమేయ నవమాలిక

## (అణు మధ్వవిజయము)

### తాత్పర్యసహితము

శ్రీ శప్రీత్యై ప్రజాత స్సుమహిత మహిమా
శ్రీ హనుమా న్నిదేశాత్
రామస్యో ల్లంఘితాబ్ధి స్స హరి రథ గతః
సేతునా పిష్ట దుష్టః ।
భూభృ న్నీరావణారిం పురగ మురుదయం
పూజయిత్వా ససీతమ్
పశ్య న్కింపురుషే తం సతత మపి మహాన్
ప్రాణముఖ్యో వతా న్మామ్॥ ౧ ॥

శ్రీ హరియొక్క ప్రీతికొఱకు శ్రీ వాయుమూర్తి ప్రప్రథమముగా శ్రీ హనుమన్నామమున వెలసెను. అద్భుతశక్తి సంపన్నుడు. శ్రీరామచంద్రునియొక్క ఆజ్ఞ ననుసరించి సీతాన్వేషణమునకై ఈ కపిపుంగవుడు సముద్రమును దాటెను. సీతజాడను స్వామికి తెల్పి, శ్రీరామచంద్రునితో గూడ సేతువును దాటి లంకలో నున్న దుష్ట రాక్షసులను అణచివైచెను. రావణవధానంతరము శ్రీరామచంద్రమూర్తి సీతతో గలిసి అయోధ్యకు వచ్చెను. ఆచట మిక్కిలి దయాస్వరూపుడై సీతతో గూడియున్న శ్రీరామచంద్రుని అంజనానందనుడు మిక్కిలి భక్తితో పూజించుచుండెను. కింపురుషలోకమునందు మాత్రమే గాక సర్వప్రాంతములం

కుము, సర్వవేళలందును శ్రీరాముని దృష్టిగోచరుని చేసికొని పూజించువాడీతడు. ఇట్టి ముఖ్యప్రాణమూర్తి ఎల్లప్పుడును నన్ను రక్షించును గాక. ॥ ౧ ॥

భీమో భూ ద్యో న భేద్య శ్చకిత రిపుకృతా
పత్త్వణో దీ సలీలం
రక్షోఘ్నః ప్రాప్తకృష్ణో మఖకృ దుపవనే
దుష్టహా కీచకఘ్నః ।
హత్వా దుర్యోధనాదీన్ స్వపద ముపగతో
యద్విషః క్రోధతంత్రా
భూత్వా భూమా కుశాస్త్రం వ్యధిషత మణిమ
త్పూర్వకాః పాతు సో స్మాన్. ॥ ౨ ॥

కుంతీదేవికి భీమసేనుడు జన్మించెను. ఇది వాయుమూర్తియొక్క రెండవ అవతారము. ఈయన పసిపిల్లవాడుగా నున్నప్పుడు ఒకనాడు తల్లి యొడినుండి క్రిందపడెను. ఆ తల్లి తల్లడిల్లి పసివాడైన తన కుమారునకు ఏమి దెబ్బ తగిలినదో అని పిల్లవానిని తీసి చూడగా ఆ బాలునియొక్క శరీరము చెక్కు చెదర లేదు గాని అతడు పడుటచే క్రిందనున్న పెద్ద కొండరాయి పిండి పిండి యైనది. దీని మూలమున తాను అభేద్యుడనని చిన్నతనముననే నిరూపించుకొనెను. చకితులైన దుర్యోధనాదులు ఈతనిని మడియించుటకు కల్పించిన ఆపదలను విలాసపూర్వకముగ ఎదురొడ్డిన ధీరుడు. ఒంటరిగ హిడింబాది రాక్షసులను సంహరించిన శక్తిమంతుడు. ద్రుపదరాజపుత్రియైన ద్రౌపదిని వివాహము చేసికొనెను. అన్నగారైన ధర్మరాజుచే రాజసూయయాగము చేయించెను. వనవాససమయమున అనేక రాక్షసుల హతుల గావించెను. అజ్ఞాతవాససమయమున వలల నామధేయుడై పరస్త్రీవ్యామోహము గల కీచకుని యమసదనమునకు పంపెను. వనవాసాజ్ఞాతవాసములకు పిమ్మట ధర్మక్షేత్రము కురుక్షేత్ర

మండలి యుద్ధమందు దుర్యోధన దుశ్శాసనాదులను చంపెను. అనంతర కాలమునందు క్రోధవశులైన దైత్యులు భూమిమీద జన్మించి వేదశాస్త్రము లకు అపార్థములను కల్పించి భీమసేనమూర్తి మరియొక అవతారమును ఎత్తుటకు నాంది పల్కిరి. అటువంటి భీమసేనమూర్తి మనలను రక్షించునుగాక. ॥ ౨ ॥

అజ్ఞానోత్సాదనార్థం సురవరవచసా
సూచితో రూప్య భర్త్రా
జాతో మధ్యాలయార్యా ద్గురుమతి తపసో
వాసుదేవాభిధానః ।
గోదాత్రే మోక్షదాతా రజతపతిపదా
సేవకో భూత భర్త్రా
మాన్యః ప్రాణః కుళిత్థై రపి నిజసహజా
తర్పితః పీయతాం మే. ॥ 3 ॥

భగవంతుడగు శ్రీహరి దేవతలప్రార్థన ననుసరించి లోకమున నున్న అజ్ఞానమును తొలగించుటకై ముఖ్యప్రాణమూర్తిని నియోగించెను. వాయుమూర్తి ఉత్తమ జ్ఞానసంపన్నులును, తపస్వులు నైన మధ్యాలయ (మధ్యగేహ) వంశమున వాసుదేవనామమున జనించిరి. వాసుదేవా చార్యులవారు వారి పసితనమున పాలకై గోవు నిచ్చిన బ్రాహ్మణునకు మోక్షము ననుగ్రహించిరి. వీరు శ్రీ అనంతేశ్వరస్వామివారి పాదసేవా రాధన తత్పరులు. భూతభర్తచే గౌరవింపదగినవారు. వీరు తమ నెలల వయస్సులోనే అక్కగారిచే నీయబడిన ఉలవగుగ్గిళ్లను తృప్తిగా తిని జీర్ణముచేసికొనిరి. ఇట్టి ముఖ్యప్రాణమూర్తి నావిషయమున ప్రీతుడగు గాక. ॥ 3 ॥

ఆనందం మందహాసామృతకళయా
సందధానః ప్రజానాం
ఆస్యేందో శోభమానై రపి కలవచనై
ర్బాల లీలా విలాసైః ।
గోపుచ్ఛా లంబనాద్యైః వృషపతివిహితా
పత్త్రిణోదీ ప్రణుద్యాత్
అజ్ఞానాద్యాపదం మే స్వయ మిహ భగవాన్
వాసుదేవో ఽసుదేవః ॥ ౮ ॥

భగవంతుడగు వాసుదేవునివలె ఈ వాసుదేవులుగూడ బాల లీలలను ప్రదర్శించిరి. ముఖచంద్రునియందు మందహాస మనెడు అమృతకలను ధరించుచున్నవారగుచు, ప్రకాశమానములగు ముద్దు లొలుకు పలుకులచే, చిలిపి బాలక్రీడలచే ప్రజలకు సంతోషము కలుగజేయుచుండెను. ఏడాది వయస్సున నొకనాడు పశువులు మేతకై పొలమునకు వెళ్లుచుండగా ఒక ఎద్దుతోక పట్టుకొని ఎవరికిని కనబడకుండ వెళ్ళిరి. మరల సాయంత్రం ఆ ఎద్దే తిరిగి వచ్చిరి. అట్లు తిరిగి వచ్చిన కుమారునిచూచి అంతవరకు దిగులు చెందియున్న తల్లిదండ్రుల ఆనందమునకు అంతులేకుండెను. తమ తండ్రి గారు తీర్చవలసిన ఋణమునకై వీరు తా మాడుకొనుచుండిన చింతగింజలను ఆ వర్తకుని చేతిలో నుంచిరి. అవియే ఆ వర్తకునకు వరహాలవలె కన్పించెను. అట్టి మహిమోపేతులగు ముఖ్యప్రాణమూర్తి అజ్ఞానాదులను ఆపదలనుండి సంరక్షించునుగాక. ॥ ౮ ॥

ఏకాకీ యోజనాభ్యాం వ్యవహిత మగమత్
య స్త్రీవరో మఠాకో
యో లాల్యో లోకమాత్రా స్వలిపిపరిచయే
తాతవిస్మేరతాకృత్ ।

ప్రాజ్ఞం మన్యం శివాఖ్యం పరిషది జితవాన్
శాఖినా మర్థ మాచే
దుర్గం పిత్రోపనీత స్సురవరమహితో
మహ్యతాం మే వచోభిః. ॥ ౪ ॥

మూడు సంవత్సరముల బాలుడుగా నున్నప్పుడు ఒంటరిగా రెండు యోజనముల దూరమున నున్న ఉడిపియందలి అనంతేశ్వరస్వామి దర్శనార్థమై నడచివచ్చెను. మార్గమధ్యమున విమానగిరియందున్న దుర్గాదేవి వీరి కెట్టి ఆపద సంభవింపకుండ రక్షించినది. అక్షరాభ్యాస కాలమున తండ్రిగారు లోకసామాన్యముగ నక్షరముల వ్రాయగా 'వ్రాసిన అక్షరములనే మరల వ్రాసితిరేల' అని పల్కి తండ్రిగారికి ఆశ్చర్యమును కలిగించిరి. ప్రాజ్ఞునిగా తలచునట్టి శివభట్టను పౌరాణికుని పురాణ ప్రవచనమునందలి అర్థగతదోషమును పసివయస్సుననే వివరింపగల్గిరి. ఒక సారి వీరి తండ్రిగారు పురాణముచెప్పుచు వృక్షనామమగు 'లికుచ' శబ్దమును వదలివైచిరి. దాని యర్థమును వీరు చెప్పి సభికులను, తండ్రి గారిని ఆశ్చర్యమగ్నులను గావించిరి. ఒక శుభముహూర్తమున జనకులచే ఉపనీతులైన వీరిని చూచి దేవతలెల్లరు సంతసించిరి. ఇట్టి శ్రీ వాసుదేవాచార్యులవారు నాస్తుతిపూర్వకమగు వాక్పూజను గ్రహింతురుగాక. ॥ ౫ ॥

పాయాన్మాం యో భుజంగం సదరి మదమయ
ద్దారి గుపాధ్యాయసేవీ
విశ్వేభ్యో వేగదూర ప్లవన జవని
యుద్ధాది వీర్యాతిశాయీ।
యేనాస్తా మూఢ శంకా శ్రుతి శుచివచసాలం
గురో శ్శీర్ష శూలా
పఖ్యాత్వా ముణాజ్ఞో ఽథయ ఉపనిషదం
వ్యాఖ్యాతాస్మై సురార్ఘ్యాః. ॥ ౬ ॥

సజ్జనులను పీడించు దైత్యుడొకడు సర్పరూపమున శ్రీ వాసుదేవా చార్యులవారిని కాటువేయగా వీరి కెట్టి అపాయమును సంభవింపలేదు. దానిని తమ బొటనవ్రేలితో చంపివేసిరి. లోకధర్మము ననుసరించి గురుకులమున చేరి పిల్లలందరివలె చదువుచుండిరి. విద్యలో సహాధ్యాయులను మించియుండిరి. చిరకాలమునుండి శిరోవేదనచే బాధపడుచున్న స్నేహితునియొక్క బాధను వాని చెవిలో నూది వాని బాధను శాశ్వతముగ పోగొట్టిరి. తమ గురువులకు ఐతరేయోపనిషత్తు యొక్క నిజార్థమును వివరించిరి. గురుకులమున శిక్షణ పూర్తిగావించిన వీరిని జూచి దేవతలు మిక్కిలి సంతసించిరి. భగవంతునియొక్క నిజతత్వమెరిగిన శ్రీ వాసుదేవా చార్యులవారు నన్ను రక్షింతురుగాక. ॥ ౬ ॥

సంన్యాసే బద్ధబుద్ధిః కృతహరినమనః
పార్థపూజ్యం యతిం ప్రాక్
ప్రాజ్ఞం గుర్వాజ్ఞయాలం సగుణహరివిదం
సత్తపస్తృప్తదైవాత్ ।
ప్రాప్తం సర్వజ్ఞ శిష్యాఖ్యావర ముపగతో
ద్విస్స్వతాతం నిషేద్ధుం
ప్రాప్తం చానుత్తరం యో వ్యథితసహజవాన్
మాతరం చావతాన్మామ్. ॥ ౭ ॥

పిమ్మట సన్యాసాశ్రమమును స్వీకరింప దలచినవారై అచ్యుతప్రజ్ఞుల (అచ్యుతప్రేక్షు) వారిని చేరిరి. ఈ అచ్యుతప్రజ్ఞులు పూర్వజన్మమున పాండవగృహమున భిక్షగైకొనిన ధన్యాత్ములు. వీరు తమ గురువులవలన సర్వగుణపరిపూర్ణుడగు శ్రీహరితత్వము నెఱిగి ఉడిపియందలి శ్రీ అనంతేశ్వర స్వామిని ఆరాధించుచుండిరి. శ్రీ అనంతేశ్వరస్వామి వీరి తపస్సునకు సంతసించి యొకనాడు "సర్వజ్ఞుడగు నొక శిష్యుడు వచ్చి నిన్నాదరింప గలడు." అని వరమిచ్చిరి. అట్టి అచ్యుతప్రజ్ఞులవారిని చేరిన తమ పుత్రుని

సన్యాసాశ్రమస్వీకరణబుద్ధిని మరల్పవలెనని ప్రయత్నించిన తండ్రిని రెండుమార్లు నిరుత్తరునిగ చేసిరి. వంశోద్ధారకుడగు మరొకపుత్రుని అనుగ్రహించి తల్లిదండ్రులకు సంతోషముకలుగజేసి ఎట్టకేలకు మాతృమూర్తియొక్క అనుమతినిపొందిరి. ఇట్టి వాసుదేవాచార్యులవారు నన్ను కాపాడుదురుగాక. ॥ ౬ ॥

పూర్ణప్రజ్ఞాఖ్య ఆసీత్ యతికులతిలకో
యశ్శుభాచార శీల
ప్రాప్తో స్మా శీశ్వరాజ్ఞాగత సురసరితి
స్నానకృజ్జైత్రపత్రః ।
దుష్పద్య చ్ఛిచ్ఛ లోకే ప్రవచన చతుర
స్సత్పురాణేతిహాస
స్యోక్తౌ మేధాప్రదర్శీ దిశతు శుభదృశం
మహ్యా మృజ్వగ్రణీస్సః. ॥ ౭ ॥

అచ్యుతప్రజ్ఞులవారివలన సన్యాసదీక్షను స్వీకరించి యతికులమునకంతటికిని భూషణమై వెలయుటచే 'పూర్ణప్రజ్ఞు' లని ప్రఖ్యాతి నందిరి. యతులకు నిర్దిష్టములైన ఆచారముల నన్నిటిని సంపూర్ణముగా నాచరించుచు నితరులకు ఆదర్శముగ నిలచిరి. అచ్యుతప్రజ్ఞులవారికి భగవద్భక్త మగు శిష్యులైరి. శ్రీ అనంతేశ్వరస్వామివారి అనుగ్రహవిశేషముచే దేవనది యగు గంగ ఉడిపిలోనున్న సరోవరములోనికి రాగా అందు స్నానము లాడిరి. తమ వాదప్రభావములచే పండితుల నోడించి విజయసూచకము లగు పత్రముల గొనిరి. అచ్యుతప్రజ్ఞులవారివద్దనున్న 'ఇష్టసిద్ధి' యను గ్రంథమునందలి ప్రథమశ్లోకములోని దోషములను తెల్పి వానిని ఖండించిరి. తమయొక్క ప్రవచన చాతుర్యముచే లోకమునంతటిని ఆశ్చర్యమగ్నులను గావించిరి. పురాణేతిహాసముల వివరించుటలో తమమేధాశక్తిని ప్రదర్శించిరి. ఋజుగణశ్రేష్ఠులగు శ్రీపూర్ణప్రజ్ఞులు తమ్ము సంపూర్ణకటాక్షములను నాపై ప్రసరింపజేయుదురుగాక. ॥ ౭ ॥

సాతూ దానంద తీర్థోను మితిభి రురుజి
ద్యోనుమా తీర్థనామా
విద్యాబ్ధిం వాదిసింహం సపది విజితవాన్
దుష్ట భాష్యాపనోదీ ।
అచ్ఛేద్యోక్తిః ప్రమోదం పితురపి కృతవాన్
మర్మ గర్భం గురూక్తో
భాష్యం కర్తుం హ్యవోచ త్ప్రియసఖయతయే
సూత్రభావం సమాఖ్యాత్. ॥౮॥

అచ్యుతప్రజ్ఞులవారు వేదాంతవిద్యను అభివృద్ధిచేయదలచినవారై పూర్ణప్రజ్ఞులవారిని శంఖోదకముచే నభిషేకించి 'ఆనందతీర్థు' లని సార్థకమగు పేరుపెట్టిరి. ఒకనాడు అచ్యుతప్రజ్ఞులవారి మిత్రుడును, తర్కశాస్త్రవేత్తయునగు ఒక సన్యాసి చాలమంది శిష్యులతో వచ్చి ఆనందతీర్థులవారితో వాదించి ఓడిరి. ఆ వాదసందర్భముగ ఆనందతీర్థులవారికి 'అనుమానతీర్థు' లను నామాంతరముగూడ లభించినది. బౌద్ధమతాభిమానులగు విద్యాసాగరుడు, వాదిసింహుడు అను ఇరువురు పండితులను క్షణకాలములో నిరుత్తరులను గావించిరి. దుష్టభాష్యమును ఖండించి యథార్థతత్త్వమును వివరించిరి. ఇట్టి వీరి ప్రతిభను కన్నులారగాంచిన వీరి తండ్రిగారు మధ్యగేహభట్టాచార్యులుగారు మిగుల మోదమందిరి. గురువుగారగు అచ్యుతప్రజ్ఞులవారు ఆక్షేపపూర్వకముగా ననిన మాటలను ఆజ్ఞగా భావించి బ్రహ్మసూత్రభాష్యమును రచించిరి. వీరి ప్రియసఖులగు యతీశ్వరులొకతు కోరగా వారికి బ్రహ్మసూత్ర భావము ఎఱింగించిరి. అట్టి ఆనందతీర్థులు నన్ను కాపాడుదురుగాక. ॥౮॥

యామ్యాశాం యాప్రభోక్తా బహుఫల సమితేః
క్షీరిణీం ప్రేక్ష్య యాంతీం
స్నానం దూరే చ దైత్యం సపది విజితవాన్
ఫాల్గునం తీర్థమాప్తః ।
సేతుం చావహాస్యం ఖల మథ కృతవాం
త్సర్వ జిద్రంగనాథం
నత్వా యా స్విశ్వవంద్యో హ్యుపనది విబుధో
కస్య వేన్నాం సధన్యః ॥ ౧౦ ॥

దక్షిణదేశయాత్ర సమయమున విష్ణుమంగళ మను క్షేత్రమున భిక్షానంతరము గృహస్థు డిచ్చిన అరటిపండ్లసముదాయమును తిని జీర్ణించుకొనిరి. క్రమముగా క్షీరనదిసమీపమున నున్న దుర్గాదేవిని సంస్మరించి అనంతశయన క్షేత్రమునకు వచ్చిరి. మార్గమధ్యమున నున్న వాదుల నందరిని జయించిరి. కన్యాకాతీరమందును, సేతుతీరమందును స్నానముల నాచరించిరి. సేతువునందు గూడ తమను పరిహాసించిన ప్రత్యర్థుల నోడించి, శ్రీరంగమునకు విచ్చేసి, శ్రీరంగనాథస్వామిని సేవించిరి. ఉత్తరదేశయాత్రకై మరలివచ్చుచు, క్షీరనది సమీపగ్రామము నందలి ఒక దేవాలయమున విడిసిరి. పరిసరప్రాంతములందున్న కొందరు భక్తులు శ్రీ ఆచార్యులవారివలన భగవంతుని స్వరూపమునుగూర్చి తెలిసికొనుచుండిరి. శ్రీహరిపదసేవాసక్తిచే ధన్యులగు శ్రీమదాచార్యుల వారు నన్నుద్ధరింతురుగాక. ॥ ౧౦ ॥

విశ్వాధినాం శబ్దార్థప్రవచన చతురో
దానహాక్కార్థవాదీ
దిన్నాజ్ఞావప్రదర్శీ సకల జి థఖిల
జ్ఞాభిధః ప్రాప్త రూప్యః ।

భీమో వా భీమసంధః ఖలకులదమనే
గీతికా భాష్యకారీ
గుర్వర్చ్యో యానుదీచీం మమ మనసి లసే
త్తీర్థ శోధీ సమధ్వః. ॥ ౧౧ ॥

'విశ్వ' మొదలగు విష్ణుసహస్రనామముల నొక్కొక్కదానికి నూరర్థముల చెప్పి వివరించిన వాక్చతురులు. 'దానసూక్తము' యొక్క అర్థమును పండితులు మెచ్చునట్లు వివరించిరి. తమ దివ్యజ్ఞానప్రదర్శనచే సకలపక్షములవారిని జయించిరి. వీరు సర్వజ్ఞులను ప్రసిద్ధి వడసిరి. దక్షిణదేశమందంతటను తమ కీర్తి జ్యోత్స్నను ప్రసరింపజేసి, మరల ఉడిపీ పట్టణమునకు విచ్చేసిరి. దుష్టుల నిగ్రహించునట్టి భీమసేనులవలె పరవాద నిర్మూలనమున శ్రీవారు భాసిల్లిరి. భగవద్గీతకు భాష్యమును వివరించిరి. గురువులగు అచ్యుతప్రజ్ఞులవారిని ఒప్పించి ఉత్తరదేశయాత్రకై బయలు దేరిరి. తీర్థశాస్త్రములను తమ శరీర వాక్స్పర్శలచే పావనమొనరించిన మధ్వముని నా మనసున విలసింతురుగాక. ॥ ౧౧ ॥

గంగాతారీ సుకర్మోపగత బదరికా
కాంత నారాయణం యో
నత్వైకాంతే సముద్యత్ప్రవచనకృ దధో
సత్తపాః కృష్ణమున్నః ॥
ఆప్తేభ్యః కార్యలేఖీ స్వమనుగతనిజ
ప్రేరకః ప్రాణమాత్రాత్
మారుత్యాభః ప్రపశ్యన్ హరిమపి గిరిణా
సార్థ మృద్ధ్యే స మే స్యాత్ ॥ ౧౨ ॥

పవిత్రమగు గంగానదిని దాటి, లోకోత్తరమగు కర్మలచే సజ్జనులను సంతోషపరచుచు బదరికాశ్రమమును చేరిరి. ఏకాంతమున నారాయణస్వామివారికి తమ గీతాభాష్యమును వినిపించి ఆనందింపజేసిరి. శిష్యులకు భగవంతుని ఎదుట గీతాభాష్యమును ప్రవచనము చేసిరి. అతి శీతలమగు గంగాతోయములందు స్నానాదుల నాచరించుచు మిగుల నిష్ఠతో తప మాచరించుచుండ వీరిని తమ ఆశ్రమమునకు రావలసినదిగా వ్యాస భగవానుడు ఆజ్ఞ యిచ్చిరి. ఆనందతీర్థులు మౌనవ్రతమున నుండుటచే ఆ విషయమును శిష్యులకు వ్రాతమూలమున తెల్పిరి. శిష్యులలో సత్యంతాప్తులగు సత్యతీర్థులు వీరిని అనుసరించుటకు ప్రయత్నింపగా వాస్తసంజ్ఞచేతనే వారి ప్రయత్నమును మానిపించిరి. తమ పూర్వావతారములగు హనుమద్భీమావతారము లందువలె దుర్గమమగు నా కొండను అతి సులభముగ దాటుచు వ్యాసాశ్రమమునుగూర్చి వెళ్ళిరి. ఇట్టి పూర్ణప్రజ్ఞులు నాకు జ్ఞానవృద్ధిని అనుగ్రహింతురుగాక. ॥౧౨॥

యోఽపశ్యత్స్వాశ్రమాగ్ర్యం మునిమహితగుణో
దివ్యసాలం చ చిత్రం
సప్తర్షీణాం సమాజే హరి మపి మునితః
సత్యవత్యాం ప్రజాతం ।
కర్తారం భారతాదేః భరతవరగురుం
బ్రహ్మసూత్రస్య చాహో
నిర్దోషం నిత్యపూర్ణాగణితగుణ మసౌ
ప్రీయతాం మే సురేశః. ॥౧౩॥

తమ ఆశ్రమము ముంగటనున్న అద్భుత బదరీవృక్షము చెంగట సప్తర్షి మండలమధ్యమున వెలుగొందుచున్నట్టియు, సత్యవతీపరాశరుల పుత్రులును, భారతాది బహుగ్రంథకర్తలును, పాండవులకు గురువై వారికి ఉపదేశమున ప్రవర్తింపజేసినవారును, బ్రహ్మసూత్రములను రచించిన-

వారును, దోషరహితులును, అనంతగుణములచే పరిపూర్ణులును నగు శ్రీ వేదవ్యాసమహర్షిని ఆనందతీర్థులు దర్శించిరి. ఇట్టి గురు శిష్యులగు శ్రీ వేదవ్యాస మధ్వమునులు నా విషయమున ప్రీతు లగుదురు గాక. ॥౧౩॥

సర్వాంగైః సర్వవంద్యైః విమలకువలయ
శ్యామలైః శోభమానం
సద్ జ్ఞానానంద తేజః ప్రవరగుణమయైః
పూర్ణ లావణ్య రూపైః ।
బింబోష్ఠం పద్మపాదం శుభకపిశజటం
సైణ చర్మాణ మీశం
దృష్ట్వా నత్వోపగూఢః సగురు రవతు మాం
సూపవిష్టో మునీష్టః. ॥ ౧౪ ॥

అందరిచే నమస్కరింపదగినట్టియు, స్వచ్ఛములగు నల్లకలువలవలె నీలవర్ణము గలవియును, ఉత్తమములగు జ్ఞానము, ఆనందము, తేజము మొదలగు గుణమయము లైనట్టియు, సంపూర్ణ సౌందర్యయుతము లైనట్టియు సర్వావయవములచే ప్రకాశించుచున్నట్టివాడును, దొండపండువంటి పెదవి గలవాడును, పద్మములవంటి పాదములుగలవాడును, శుభప్రదమగు కెంజడలుగలవాడును, జింకచర్మముమీద నాసీనుడైనవాడును, పరమాత్మయు నగు శ్రీ వేదవ్యాసమహర్షిని శ్రీ మదానందతీర్థులు దర్శించి ఆలింగనపూర్వకమగు అనుగ్రహమును పడసిరి. వ్యాసమునిచే ననుజ్ఞాతులై కూర్చుండిరి. అటనున్న మునులందరకు నిష్టులగు పూర్ణప్రజ్ఞులు న న్ననుగ్రహింతురు గాక. ॥ ౧౪ ॥

శిష్యం వ్యాసస్య నారాయణ మథ చ గతం
సత్య హేతుం సుముఖ్యం
సాక్షాత్స్వం కార్మకోటా న్మహారి మథ మనుం
పాపఘ్నం బద్ధ [illegible] ।

వ్యాసం కాకుత్స్థ కృష్ణా వతి చిర వింతకా
నందనం కల్కి యాజ్ఞా
సిద్ధేశం నౌమి ధన్వంతరి వర వనితాఖ్యాం
తమేనం స్మరన్తమ్. ॥ ౧౫ ॥

శ్రీ వ్యాస మధ్వమునులు సమీపస్థమైన నారాయణాశ్రమమునకు వెళ్లిరి. అచట సర్వకారణభూతుడగు భగవంతుని ప్రస్తుతించిరి. భగవంతుని యొక్క మత్స్య, హయగ్రీవ, కూర్మ, వరాహ, నరసింహ, (తాపస) మను వామన, బుద్ధ, పరశురామ, వ్యాస, దాశరధి, కృష్ణ, ఐతరేయ, కల్కి, యజ్ఞ, కపిల, ధన్వంతరి, మోహిన్యాది బహురూపములను స్మరించు చున్నట్టి వ్యాసముని ప్రియశిష్యులగు మధ్వమునిని ఎల్లప్పుడును నమస్కరింతును. ॥ ౧౫ ॥

దత్తాత్రేయం కుమారం హృది దధ ధృషభం
హంస కృష్ణౌ హరిం తం
ధర్మం నారాయణాఖ్యం స దశ శత సహస్రా
ద్యనంతావతారం।
తన్మన్న స్తత్వసూక్త్యై వర ముచితనరై
రేవ సేవ్యత్వ మాప్తః
కృచ్ఛ్రాద్యాత్రో న్మఖో మే సగతి రపి
హరి ర్వ్యాసనారాయణాఖ్యః. ॥ ౧౬ ॥

దత్తాత్రేయ, సనత్కుమార, వృషభ, హంస, కృష్ణ, హరినారాయణాదులు పదులు, వందలు, వేల రూపములచే అనంతావతారుడగు నారాయణమునిని ఆ నారాయణాశ్రమమున మనసునందు శ్రీ మధ్వాచార్యులవారు ధ్యానించిరి. జగత్తునకు అంతకును యథార్థతత్వమును తెలియజేయుటకుగాను వేదసూక్తులకు వ్యాఖ్య వ్రాయవలసినదిగా భగవాను

డగు నారాయణమునులచే నాజ్ఞాపింపబడిరి. తత్వమును మరచిన సజ్జనులకు నిజమార్గమును తెల్పి వారినుండి సేవలను స్వీకరింపవలెనను ఆజ్ఞ నంగీకరించిరి. వారి ఆజ్ఞను శిరసావహించి అటనుండి మరలి బదరికాశ్రమమునకు వచ్చిరి. వ్యాసనారాయణరూపముననున్న భగవంతుడు, మధ్వముని నాకు ఆధారమగుదురుగాక. ॥ ౧౬ ॥

లబ్ధ్వానుజ్ఞాం ముకుందాత్స్వజనముపగతో
ఽనేక భిక్షా ప్రభోక్తా
తుల్యం భాష్యం చ కుర్వన్ స్వగుణసమగుణం
సంప్రయాతః పునర్యాన్ ।
షట్ఛాస్త్రి శేషశాఖా స్వఖిల విజయవాం
చ్ఛోభనం సూరివర్యం
శిష్యం లబ్ధ్వాతి జైత్రం పున రపి వివిధాన్
ప్రాప్తరూప్యో గతిర్మే ॥ ౧౭ ॥

వ్యాసనారాయణులనుండి అనుజ్ఞపొంది మధ్వాచార్యులవారు తమ శిష్యులను వదలిన దక్షిణబదరికి వచ్చిరి. వారచట నొకే దినముందురని తెలిసి వారి శిష్యులు సమర్పించిన అనేక భిక్షల నొక్కమారుగ భుజించి జీర్ణించుకొనిరి. భగవంతునకు ప్రియకరమగునట్టియు, అనుపమమైనట్టియు భాష్యమును బ్రహ్మసూత్రములకు రచించిరి. షట్ఛాస్త్రములందును, వేదవేదాంగములందును పండితులగువారితో వాదించి విజయవంతులైరి. అందరను జయించిన మహాపండితుడగు శోభనభట్టను నాతనిని వాదమున జయించి శిష్యునిగా స్వీకరించి ఉడిపీపట్టణమునకు మరలివచ్చిరి. ఇట్టి మధ్వాచార్యులవారు నాకు గతి (ఆధారము) అగుగాక. ॥ ౧౭ ॥

సత్యే వ్యాఖ్యాయ భాష్యం కలిమల మపనీ
యాచ్యుత జ్ఞాయ చాలం
శార్ఙీ మర్చా మచాల్యాం త్రిదశక తరుణై
ర్లీలయా నీయ రూప్యే ।
ఆస్థాప్యోదస్య యజ్ఞప్రతిహతి నితరాం
కారయిత్వా స్వయజ్ఞం
వ్యాసం నత్వా పునశ్చ ప్రతిగతరజతః
సంప్రసీదే త్స మధ్వః ॥ ౧౭ ॥

గురువులగు అచ్యుతప్రజ్ఞులవారికి బ్రహ్మసూత్రభాష్యమునందలి భావమును వివరించి కలిప్రభావమువలన వారికి సచ్ఛాస్త్రములందు గల్గిన అరుచిని తొలగించిరి. శ్రీ మద్యాచార్యులవారి తపోబలముచే కృష్ణవిగ్రహమందు హరిసన్నిధానమేర్పడగా దానిని ఉడిపిలో ప్రతిష్ఠచేయుటకై తెచ్చుటకు ముప్పదిమంది తరుణవయస్కులు ప్రయత్నించి విఫలులైరి. అట్టి శ్రీకృష్ణప్రతిమను సవిలాసముగ ఎత్తి ప్రతిష్ఠచేసిరి. అనంతరము గురుపుత్రుడైన వాసుదేవుడను బ్రాహ్మణునిచే యజ్ఞము చేయించిరి. మరల బదరికాశ్రమమునకు వెళ్ళి వ్యాసమహర్షికి నమస్కరించి ఉడిపికి మరలి వచ్చిరి. ఇట్టి మధ్వాచార్యులవారు ప్రసన్నులగుదురుగాక. ॥ ౧౭ ॥

సాగస్త్వా దీశదేవం పరవశ ఖననం
యోవ్యధా దష్టవైసైన్యః
గంగాతారీ స్వరీత్యా వశిత యవరా
ద్వర్త్మని క్వాపి చోరాన్
హంతుం యాతాన్నిధోఽహాన్ క్వచి దపి నిజ
శిష్యేణ చాద్రావ యద్రాక్
యోగేనా సీచ్చి లాభః క్వచిదపి సగణ
స్తం మహేశం దిదృక్షే ॥ ౧౮ ॥

యాత్రికులకు వెళ్ళనటువంటి నిరపరాధులగు జనముచే ఈశదేవుడను రాజు వెట్టి చేయించుచుండెడివాడు. శ్రీ మధ్వాచార్యులవారు అట్టి ఈశదేవునే పరవశునిచేసి అతనిచేతనే సాయంకాలమువరకు త్రవ్వించిరి. ఒకసారి పడవలు లేకయే గంగ నెట్లు దాటితిరని అడిగిన యవనరాజునకు ఆ భాషలోనే సమాధానమిచ్చి వానిని నిరుత్తరునిగ చేసిరి. మరొక సమయమున తమ శిష్యులతోగూడ అడవిమార్గమున వెళ్లుచుండ చాలమంది దొంగలు రాగా వారిలోవారు కొట్టుకొని చచ్చునట్లుచేసిరి. వేరొక సలమున బలాఢ్యులగు దొంగలురాగా శ్రీవారి శిష్యులలో నొకరగు ఉపేంద్రతీర్థులవారు ఆ దొంగలవద్దనున్న గండ్రగొడ్డలిని లాగికొని వారిని తరిమివేసిరి. వేరొకప్రదేశమందు మధ్వాచార్యులవారును, వారి శిష్యులును దొంగలకు శిలారూపముగా కనబడగా తమదారిన తాము పోయిరి. ఇట్టి మహిమోపేతులగు పూర్ణప్రజ్ఞుల దర్శనభాగ్యము గలుగును గాక. ॥ ౧౯ ॥

దైత్య వ్యాఘ్రోపఘాతీ నరసఖ కరతో
లబ్ధ గార్గోపలార్చ్చో
వ్యాసాజ్ఞా భృత్త్వ తర్తా లఘు సురసరితో
వారి సంస్తంభ యోగాత్ ।
భిత్వా భూమిం ద్యునద్యా మఠ ముపగతయా
వందితో మూర్తిమత్యా
యానోఽకా న్విజజ్ఞే యుగపదుపగతా
న్యస్సలీలం తమీడే. ॥ ౨౦ ॥

ముందు నడచుచున్న సత్యతీర్థులవారిని కబళించుటకు పులిరూపమున నున్న దైత్యుడొకడు రాగా మధ్వాచార్యులవారు తమ చేతితో అనాయాసముగ చంపివేసిరి. వ్యాసాశ్రమమును చేరి నమస్కరింపగా వీరికి శ్రీ వేదవ్యాసమహర్షి చిన్న చిన్న శిలారూపమై, లక్ష్మీనారాయణ

సన్నిధానముగల ప్రతీకల నిచ్చిరి. వీనినే వ్యాసముష్టిక అందురు. "మహాభారత తాత్పర్య నిర్ణయము వ్రాయుము" అనిన శ్రీ వేదవ్యాసుల వారి ఆజ్ఞను శిరసావహించి అచటినుండి బయలుదేరిరి. జలస్తంభనచే అవలీలగా గంగానదిమీద నడిచి దాటిరి. హస్తినాపురసమీపమున మధ్వాచార్యులవారుండగా గంగాదేవి భూమిని ఛేదించుకొనివచ్చి స్త్రీ రూపమున ఆచార్యులవారికి దండప్రణామముల నాచరించినది. గర్వితులైనట్టియు, తరుణవయస్కులైనట్టియు అనేకులగు శిష్యులను వారి బల గర్వము నణచుటకై యేకకాలమున పరాజితుల జేసిరి. అట్టి మధ్వమునిని ఎల్లప్పుడును స్తుతింతును. ॥ ౨౦ ॥

స్వర్గా హ్వోక్తి ప్రఖండీ సకలసమయ జి
ద్వ్యాఖ్యయాభాత్పురాజౌ
శిష్యాణా మాయుధాని ప్రకటయతి పురా
పూజితః శూలినాలం ।
ప్రత్యక్షేణ క్వచి ద్వ్యో దశ శత
గురురంభాపలా భుక్
తృణాత్సద్గానైః పుష్పాదికారీ త్యభిహిత చరితో
యస్మ్నభై స్తం ప్రపద్యే. ॥ ౨౧ ॥

ఇంద్రపురి అను పేరుగల పండితసన్యాసిని వాదమున నోడించిరి. సమస్తమైన పరవాదుల సిద్ధాంతములను ఖండించి విజయమందిరి. శ్రీవారి ప్రవచనపు సాగనుచే సభ లన్నియు మిక్కిలి శోభిల్లినవి. కురుక్షేత్రము నకు వెళ్ళినప్పుడు తమశిష్యులకు తాము భీమావతారమున నుపయోగించిన ఆయుధములను వెలుపలికి తీసి చూపించిరి. బ్రాహ్మణరూపమును ధరించిన రుద్రునిచే పూజింపబడిరి. ఇనుపాక క్షేత్రమునం దొక గృహస్థుడు వీరి శక్తిని పరీక్షించుటకై సమర్పించిన లావైన వేయి అరటిపండ్లను భుజించి జీర్ణించుకొనిరి. ఇదే మరియొకచోట నాల్గువేల అరటిపండ్లను, మూప్పది

చింతల పాలను సమర్పింపగా వానిని అనాయాసముగ జీర్ణించుకొనిరి. శ్రీ ఆచార్యులవారు తమ గానప్రభావముచే అకాలమున వృక్షములను ఫలపుష్పభరితముగావించిరి. ఈవిధముగా శ్రీవారి శిష్యులచే తెల్పబడిన విలాసములుగల శ్రీమధ్వాచార్యులవారు నాకు శరణము. ॥ ౨౧ ॥

వ్యాఖ్యాం శ్రుత్వా మునిభ్యోఽభ్యధిత సమయతో
యస్య లభ్యం ఫణీంద్రో
వైకుంఠం హేమ నానా మణిమయసదనం
శ్రీశధామాస్త దోషం ।
సాయుజ్యాద్యాప్త సౌఖ్యై రఖిల విషయిభి
స్సుందరీ భోగభాగ్భిః
బ్రహ్మాద్యై ర్నాథ దృగ్భి ర్విలసిత మతులం
సోనుగృహ్ణాతు నోఽలం. ॥ ౨౨ ॥

శిష్యులకు బ్రహ్మసూత్రవ్యాఖ్యను వివరించుచుండగా ఆదిశేషుడు సనకసనందాదులతో వచ్చి అంతర్హితులై వినుచుండిరి. సనకాదిమునులు "ఈ మధ్వశాస్త్రాధ్యయనము చేసినవారికి, అనుష్ఠానము నాచరించినవారికి కలుగు ఫలమేమి" అని శేషు నడిగిరి. అప్పుడు శేషు డిట్లు పల్కెను— "మధ్వశాస్త్రముయొక్క ముఖ్యఫలము మోక్షము. ఇట్టి వైకుంఠము బంగారము, అనేకములగు మణులచే నిర్మితమైనట్టిది. శ్రీవల్లభుని నివాసము. జననమరణాది దోషరహితము. ముక్తులైన బ్రహ్మాదులు సాయుజ్యాదులగు సుఖముల ననుభవించుచున్నారు. అచట దేనికిని కొరతలేదు. ఇట్టి వైకుంఠమును పొందుటయే మధ్వశాస్త్రముయొక్క ఫలము." ఇట్టి శాస్త్రమును మనలకు ప్రసాదించిన ఆనందతీర్థ భగవత్పాదులు మామీద నెల్లప్పుడు అనుగ్రహము నుంచుదురుగాక.

॥ ౨౨ ॥

నానా దుర్నీతివాదై ర్విహిత మురుమదం
మాయిభూతాసురేంద్రైః
యోయం వేదాంతిసింహో వ్యజయతకురవం
పుండరీకం చ కాండం।
విశ్వాశ్చర్య ప్రకార ప్రవచన మకరో
చ్ఛందసాం యత్రప్రధాన్యః
తత్కుర్వన్ హాస్య ఆసీద్ద్విజవరనికరే
స్యామ తద్దాస దాసాః ॥ ౨౩ ॥

దుర్జనులగు మాయావాదులు కొంతమంది పండితుడనని విఱ్ఱవీగు చున్న పుండరీకపురి యనువానిని శ్రీమదాచార్యులవారితో వాదమునకై నిల్పిరి. వాదిసింహమగు శ్రీమధ్వాచార్యులవారు తమ వాగ్బాణములచే ప్రత్యర్థికి వాగ్బంధనము గావించిరి. పండితమండలి ఆశ్చర్యపడునట్లు శుద్ధస్వరముతో వేదమంత్రములను పఠించిరి. అప్పుడు అనూర్యాగ్రసుడైన పుండరీకపురి పండితుల ఎదుట వేదమంత్రముల వివరింపనెంచగా పద విభజనము చేయుటలోనే దోషము కన్పింపగా నచట చేరిన పండితులచే, ప్రజలచే పరిహసింపబడెను. అటువంటి మధ్వాచార్యులవారి దాసులకు దాసుడనగు అదృష్టము నాకు కలుగునుగాక. ॥౨౩॥

పద్మాఖ్యం సింధురాజం ప్రియ జనపర
మాగస్కృతం ప్రాప్య భీతేః
అన్యాన్కార్యాణ మగ్రే సపది నిజగృహే
గోగణై ర్మధ్వపార్థః।
యో యద్దాసోక్తి బాణై ర్విదలితహృదయో
దుద్రువుర్మాయి దైత్యాః
సర్వజ్ఞాఖ్యో హరిర్వో జగతి విజయతే
సప్రపద్యా జ్జయం నః ॥ ౨౪ ॥

తమకు ప్రియశిష్యుడగు శంకరపండితునియొద్ద నుంచిన మధ్వాచార్యులవారి పుస్తకములను మాయావాదియగు పద్మతీర్థుడను నాతడు అపహరించెను. ఈ విషయము నెరిగి ఆచార్యులవారు వానిని వెంబడించి వెళ్లి, అర్జునుడు సింధురాజైన జయద్రధుని తన బాణములచే నిగ్రహించినట్లు పద్మతీర్థుని నిగ్రహించిరి. ద్రోణుడు, కర్ణుడు మొదలగువారిని ముందుంచుకొని ప్రాణభీతిచే పద్మవ్యూహమున దాగున్న సైంధవుని అర్జునుడు జయించినట్లు, పుండరీకపురి మొదలగు మాయిదైత్యులను ముందుంచుకొనిన పద్మతీర్థ యతిని శ్రీ మధ్వాచార్యులవారు తమ వాచవైఖరిచే నిరుత్తరుని చేసిరి. శ్రీ ఆచార్యులవారి దాసులయొక్క వాగ్బాణములచే బ్రద్దలయిన హృదయములు గలవారై ఆ మాయిదైత్యులెల్లరు పలాయితులైరి. సర్వజ్ఞులైనట్టియు, ఎల్లయెడల విజయశీలురైనట్టియు శ్రీ మధ్వాచార్యులవారు మాకు ఎల్లప్పుడును జయమును చేకూర్తురుగాక. ॥ ౨౮ ॥

శ్రీకాంతాంఘ్రిప్రసంగా దధిక శుభతమా
యాన్యథా గాంగ ఓఘో
రాజ్ఞా సంవందితాంఘ్రిః సకలగుణగణో
పేతపాదాదికాంతః ।
సర్వేషాం దర్శనీయో లికుచకులభవో
వేదశాస్త్రాతివేదీ
ప్రాయాద్య ద్విక్రమార్యో య మఖిలగురు
మానందతీర్థం తమీడే ॥ ౨౯ ॥

విష్ణుపాదోద్భవయును, పరమపావనియు నగు గంగవలె ఎల్లప్పుడు శ్రీహరిపాదప్రసంగముచే పరమపవిత్రులగు శ్రీమధ్వాచార్యులవారు తమ సంచారమున ఎల్లరను పవిత్రులచేయుచు రాజగు జయసింహుని ప్రార్థన నాలకించి వారి యాస్థానమునకు బయలుదేరిరి. సర్వాత్మనా ఆశ్రితులగు శ్రీమధ్వాచార్యులవారి పాదములకు నమస్కరించి జయసింహుడు శ్రీవారి

మన్ననలకు పాత్రుడయ్యెను. శ్రీ ఆచార్యులవారు ఎల్లరకు పూజనీయులైరి. వేదశాస్త్రవేత్తయు, సకలశాస్త్రపండితులును, లికుచవంశోద్భవులు నగు త్రివిక్రమపండితులను శ్రీవారు ఆకర్షించిరి. ఇట్టి లోకగురువగు ఆనందతీర్థ భగవత్పాదులను కొలిచెదను. ॥ ౨౫ ॥

లబ్ధ్వాగ్రంథస్తతోఽలం లికుచకవివరే
౦ ౨ ౮ ౦ శేహ నిన్యే దినాని
శ్రీ భర్తుః ప్రీతివృద్ధ్యై వివిధ శుభకృతీః
కేవలం యస్తు కుర్వన్ ।
నిర్లేపో దగ్ధకర్మా మతికృతి చరణైః
లోకశిక్షాంచ కర్తుం
దేవైః వృష్టామృతార్చః ప్రవచననిరతో
మే ప్రవక్తృత్వదః స్యాత్ . ॥ ౨౬ ॥

పద్మతీర్థయతి అపహరించిన పుస్తకములను జయసింహభూపతి మూలమున తిరిగి పొందిరి. కవివరులగు త్రివిక్రమపండితులచే ప్రస్తుతింపబడిరి. దగ్ధకర్ములు, నిర్లేపులు నైనప్పటికిని భగవత్ప్రీతికొరకును, లోకశిక్షణకొరకును జ్ఞానకర్మాద్రియములచే జపానుష్ఠాన ప్రవచనాది సత్కార్య అను ఆచరించుచు దినముల గడపుచుండిరి. తాము పూజించిన సాలగ్రామ శిలలందు దేవతలు కురిపిన అమృతబిందువులను చూచి శిష్యులెల్లరు అద్భుత మందిరి. ప్రవచనచతురులగు శ్రీమదానందతీర్థులు నాకు ప్రవచనము చేయగల శక్తి నిచ్చెదరుగాక. ॥ ౨౬ ॥

స్నాతో దేవాభిషేక్తా సదరి దర ధర
స్తంత్ర శాస్త్రానుస్మృత్యా
సమ్యక్సంపూజ్య విష్ణుం వరతులసికయా
పూర్ణసియోఽథ భుక్త్వా ।

నానా లోకాభినందీ గురు రథ విలస
ద్వ్యాఖ్యయా సాంధ్యకృత్యం
కృత్వా గోవిందలీలా కథక ఉత కథాం
వైష్ణవీం వాచయేన్నః. ॥ ౨౭ ॥

ఉదయమునందే స్నానముచేసి సాలగ్రామతీర్థజలమును శిరమున ధరింతురు. మధ్యాహ్నకాలమున మరల స్నానమాచరించి గోపిచందనముచే శంఖచక్రాదుల ధరించి తంత్రశాస్త్రానుసారముగ సకలోపచారములచే తులసిదళములచే భగవంతుని పూజింతురు. భిక్షాస్వీకరణము అయినపిమ్మట తమకొరకై వేచియున్న జనులకు తమ దర్శనభాగ్యమును కలుగజేసి వారితో కొంత తడవు సంభాషించి పంపెదరు. పిమ్మట జిజ్ఞాసువులగువారిని తమ ప్రవచనములచే తృప్తిపరచెదరు. సంధ్యాకాలపు కర్మలను నిర్వర్తించి లీలలను ప్రతిపాదించు పురాణగాథలను వివరింతురు. ఇట్టి మధ్వాచార్యుల వారు నాకు ఎల్లప్పుడు విష్ణునామస్మరణమున ఆసక్తిని కలిగించెదరు గాక. ॥ ౨౭ ॥

మాన్యోపన్యాస ధన్యో హరి రఖిలగుణో
బ్రహ్మవేద్యైకవేద్యః
కర్తా విశ్వస్య మోక్షం శుభసుఖవిషయం
రాతి భక్తేభ్య ఇత్థం ।
సత్తర్కై స్సాధయిత్వా శ్రుతి శతసహితై
స్సూరి సూనుం విజిత్య
వ్యాఖ్యాతా తస్య పూర్ణప్రమతి రను దినం
వ్యాఖ్యయాప్యాయ యేన్నాం. ॥ ౨౮ ॥

త్రివిక్రమపండితులతో జరిపిన వాదమూలమున తమ సర్వజ్ఞత్వమును వెల్లడించి, హరిసర్వోత్తమత్వమును ఈవిధమున నిరూపించిరి — "నారాయణుడే సర్వవేదములచే ప్రతిపాద్యమానమగు పరబ్రహ్మము; నారాయణుడే సర్వచరాచరజగత్తునకు కారణము; నారాయణుడే సర్వగుణములచే పరిపూర్ణుడు; అట్టి నారాయణుని భక్తితో ఆరాధించినవారు మాత్రమే కేవల సుఖమయమగు ముక్తిని పొందగలరు". ఈవిధముగ నూరు పైగా శ్రుతివాక్యములచే, శాస్త్రవాదయుక్తులచే హరిసర్వోత్తమత్వ తత్వమును నిరూపించి త్రివిక్రమపండితులను జయించిరి. ఇట్టి పూర్ణప్రజ్ఞులు ప్రతిదినము తమవ్యాఖ్యానమును పాటింపజేయుటమూలమున నన్ను సంతసపరచుదురుగాక. ॥ ౨౭ ॥

సన్మంత్రైః విక్రమార్యోద్యర్చయ
దణుభాష్యం శతగ్రంథకర్తా
సోదర్యం స్వం విరక్తం యతి మకృత మహా
సద్గుణం విష్ణుతీర్థం ।
వాదీంద్రం పద్మనాభం ప్రియమథ చపరాం
త్సద్గుణా శ్లాఘ్య శిష్యాన్
యోనేకాన్ సద్గృహస్థా నపి స విజయతే
కణ్వ తీర్థాంతికస్థః ॥ ౨౮ ॥

బహుగ్రంథకర్తయైన శ్రీమధ్వాచార్యులవారు త్రివిక్రమపండితుల ప్రార్థనను మన్నించి అణుభాష్యమును విరచించిరి. విరక్తులై సద్గుణవంతులగు సోదరునికి సన్యాసదీక్షనిచ్చి 'విష్ణుతీర్థ' అని పేరిడిరి. మరొక ప్రియశిష్యులు వాదనైపుణ్యముగలట్టి శోభనభట్టులకుగూడ సన్యాసదీక్షనిచ్చి 'పద్మనాభతీర్థ' అని పేరిడిరి. ఇంకను జ్ఞానవైరాగ్యాది గుణములతో నొప్పు యోగ్యులగు అనేక శిష్యులకుగూడ సన్యాసదీక్షనిచ్చిరి. అనేకులగు యోగ్య గృహస్థులనుగూడ తమ శిష్యులనుగా

స్వీకరించిరి. కణ్వాతీర్థమునకు సమీపస్థమైన ఒక మఠమున చాతుర్మాస్య దీక్షవహించిరి. ఇట్టి మధ్వాచార్యులవారు జ్ఞానులందరిలో మిక్కిలి జ్ఞానులై విలసిల్లిరి. ॥ ౨౯ ॥

సంస్తుత్యో వేదమానం సముచితమతనో
దోష ధీర్యః క్షణాంతే
దీప్తాంగుష్ఠః శిలానీ(శ్శ్మతి వివరణ కృ
ద్వర్ధితః స్తంభితాబ్ధిః ।
అంగుళ్యా గండవాటా వతుల బల చణౌ
చాలనే యస్యనాలం
ప్రాగ్వాటో వావటూఢో మమ మనసి లసే
దస్య చార్త్యేకలోమా ॥ ౩౦ ॥

వేదప్రామాణ్యమును రక్షించుటకుగాను శ్రీమదాచార్యులవారు కొన్ని బీజములను తీసికొని ఓషధిసూక్తమును జపించి తత్ క్షణమే వానిని మొలిపించి, పంట రావించిరి. ఒక రాత్రి పాఠప్రవచనము చేయుచుండగా దీపము ఆరినది. అప్పుడు తమ కాలి బొటనవ్రేలిని దీపింపజేసి ఆ కాంతిలో తమ పాఠప్రవచనమును కొనసాగించిరి. తుంగభద్రా నదీప్రవాహమునకు అడ్డుగా నున్నట్టి, వేయిమంది బలవంతులు గూడ కదల్పలేనటువంటి పెద్దరాతిని అతి సులభముగా నెత్తి ఒడ్డున వేచిరి. కణ్వాతీర్థమునకు సమీపముననున్న సముద్రతీరమున నొక సూర్యగ్రహణ సమయమున నుచ్చైస్స్వరముతో ఐతరేయోపనిషన్మంత్రముల ప్రవచించిరి. వారి ప్రవచనసౌందర్యము నాలకించిన గుణగ్రాహులు శ్రీవారి ప్రజ్ఞను ప్రస్తుతించిరి. ఉత్తుంగతరంగములతో నొప్పునట్టి సముద్రము వీరి వీక్షణమాత్రముచేతనే తటాకమువలె ప్రశాంతమైనది. గండవాటుడను మొదలగు కొంతమంది బలమత్తులగు మల్లురు శ్రీవారి బలమును పరీక్షింప నెంచి వారి క్షేమమాత్రమును ఆందోళన కలిగింపలేకపోయిరి. శ్రీవారే

మూర్ఛిల్లిరి. ఇట్టి వజ్రకాయుడైనప్పటికిని పిన్నవయస్కుడగు బ్రహ్మచారి భుజమున నెక్కి దేవాలయ ప్రదక్షిణము గావించిరి. వీరిని భుజముమీద నెక్కించుకొనినటువంటి వటువున కేమాత్రము బాధ కలుగలేదు. ఈవిధ మగు మహామహిమోపేతులగు శ్రీమదాచార్యులవారెల్లప్పుడు నా మనసున విలసిల్లుదురుగాక. ॥ ౩౦ ॥

పారం తీశాభి నందీ స సపది సరితా
మంత రేఽవర్షయ ద్యః
గ్రీష్మే మిత్రీ చకారాప్యహిత మథ గతో
వైద్యనాథం స్వ భూత్యై ।
ఛందః ఖండార్థవాదీ జితకుమతికులో
దుర్జనే ష్వా భ్యుపేక్షీ
లబ్ధ్వాన్నం బృంహయే దత్యతి బహు ధనినా
మల్పక ల్పేన తుష్యేత్. ॥ ౩౧ ॥

పారంతీ యను గ్రామమునందలి పంచమూర్తిభగవంతునకు బహు కాలమునుండి పూజలేకపోవుట యెరింగి శ్రీమదాచార్యులవారు ఒక్క దినములో నందు యథావిధి పూజాదులు జరుగు నేర్పాట్లు గావించిరి. గ్రీష్మఋతువులో 'ఇడతుడ' అను గ్రామములో త్రాగుటకుగూడ నీరులేక గ్రామస్థులు బాధపడుచుండగా జాలిగొని వర్షము కురిపించి నీరు లభించు నట్లు చేసిరి. ఆ గ్రామాధిపతి దుర్బుద్ధిప్రేరితుడై శ్రీవారిని బాధించుటకు ప్రయత్నింపగా తమమహిమచే నట్టివానిని మిత్రుని గావించుకొనిరి. వైద్యనాథక్షేత్రమందున్న ఒక భక్తుని ఉద్ధరింపదలచి ఆ క్షేత్రమునకై వెళ్ళిరి. 'ఉజర' అను గ్రామమునందు ఐతరేయబ్రాహ్మణమునకు అర్థ వివరణము చేసిరి. దుర్బుద్ధిచే వాదమునకై వచ్చిన యాజ్ఞికులను పరా జితుల గావించిరి. తమకు భిక్ష యొసగిన భక్తుడు బీదవాడైనచో అట్టి

వానికి నాలుగురెట్లు సంపదల ననుగ్రహించి కరుణించినారు. భాగ్య వంతుల గృహములకు వెళ్ళినప్పుడు పెక్కుమందికి సరిపడు భోజనమును తామే భుజించి ఆ గృహస్థులకు సంతోషము చేకూర్చెడువారు. అట్టి శ్రీమధ్వాచార్యులవారు ప్రసన్నులగుదురుగాక. ॥ ౩౧ ॥

వృష్ట్యా దీనాం నియంతే త్యభిహిత చరితః
సర్వ గీర్వాణ రత్నైః
గంధర్వైః గీయమానో ద్యుసదసి విలస
త్కౌతుకం గమ్యమానః ।
దృష్ట్వా సంస్తూయమానః సురతరుకుసుమైః
ఆర్య ఆశీర్యమాణో
మధ్వో దేదీప్యతేసౌ జగతి విజయతే
సత్సభామంగళాయ. ॥ ౩౨ ॥

వృష్ట్యాది సర్వప్రకృతి శక్తులను తమ ఆజ్ఞానుసారము ప్రవర్తింప జేసిరని జనులందరును శ్రీ మధ్వాచార్యులవారిని శ్లాఘించిరి. దేవసభ యందు దేవతలుగూడ వీరి చరిత్రను కీర్తింపగా గంధర్వులు సంతోష ముతో గానముచేసి నాట్యము సల్పిరి. ఋషి ముని గణములును, గంధర్వు లును, దేవతలును శ్రీమదాచార్యులవారి ముంగట నిల్చి, శ్రీవారు ఐతరేయప్రవచనము చేయుచుండ నమస్కరింతురు. స్వర్గోద్యానము నందలి పుష్పమాల వారిపై కురియుదురు. ఈవిధముగ మధ్వముని జగత్తు నందంతటను ప్రకాశించుచున్నారు. ఇట్టి శ్రీమదానందతీర్థభగవత్పాదులు సజ్జనులయొక్క కల్యాణముకొరకు జయశీలురగుచున్నారు. ॥ ౩౨ ॥

దశప్రమతి విక్రమం శ్రుతిపురాణసంవర్ణితం
సుమధ్వ విజయాభిధం వ్యధిత భావదీపాహ్వయం।
ప్రమేయ నవమాలికాం పునరిమాం చదత్కాంచితాం
సతాం శ్రవణ భూషణం వ్యతనుతైష నారాయణః.
॥ 33 ॥

ప్రస్తుత గ్రంథమును రచించిన నారాయణపండితులు మొదట 'సుమధ్వ విజయము' అను గ్రంథమును రచించి, దానికి 'భావప్రకాశిక' అను టీకనుగూడ వ్రాసిరి. పిమ్మట బుద్ధిమంతులు మెచ్చుకొనదగినట్టియు, సజ్జనులకు శ్రవణ భూషణమైనట్టియు ఈ 'ప్రమేయ నవమాలిక' అను గ్రంథమును రచించిరి.

కవికుల బిరుదాంచితులగు శ్రీమత్త్రివిక్రమ పండితాచార్యుల పుత్రులగు శ్రీమన్నారాయణ పండితాచార్యులవారిచే విరచింపబడిన 'శ్రీమత్ప్రమేయ నవమాలిక' యను పేరు గల్గిన 'శ్రీమదణు మధ్వవిజయము' సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

# మధ్వనామావలిః

శ్రీమద్ధనుమద్భీమమధ్వాం తర్గతరామకృష్ణ

వేదవ్యాసాత్మక శ్రీలక్ష్మీ హయగ్రీవాయనమః

అనాదిభవదుఃఖౌఘ బాధితానాం నృణామిహ ।
శ్రీ మధ్వ విజయే కావ్యే నాదిరాయణ పండితైః ॥ ౧

శ్రీమధ్వాచార్యనామాని యాని ప్రోక్తాని తాన్యహం ।
పారవృత్త్యాభీష్ట సిద్ధా వుద్ధరామి సుభక్తితః ॥ ౨

స వాసుదేవో మాం పాయా దమానవనవాక్కృతిః ।
విష్ణుదాసో హరిపదః పృథుధీః పాతు మాం సదా ॥ ౩

త్రిసంధ్యం మాం పాలయతు వసుదేవసుతాహ్వయః ।
సదా చతురధీః పాతు మాం తథా త్రిజగద్గురుః ॥ ౪

అవ్యాద్భువనభర్తా ద్విజకుమారోఽపి మాఽవతు ।
ఛలమానుషో గురుశ్చైవ ద్విజసూనుస్త్వథైవచ ॥ ౫

పాతు మాం త్రిభువనగురుః గురుశ్చైవ జగద్గురుః ।
విభుస్త్వ వ్యాద్విశ్వావి చ్చాలయ బుద్ధిస్తథైవ చ ॥ ౬

పూర్ణబోధః పాలయతు మాం తథైవ మహామతిః ।
భూరిచేతా పూర్ణబుద్ధిః మహాత్మా పూర్ణధీ రపి ॥ ౭

ప్రభు స్తథా మహాహ్వాచ్చ భూరిహ్వాచ్చ తథైవ చ ।
పాతు మాఽమితబుద్ధి శ్చాదభ్రచేతా స్తథైవ చ ॥ ౮

ఆనందతీర్థోఽవతు మాం గురుబుద్ధి రఖండ ధీః ।
అనుమాన తీర్థశ్చ తథాసుఖతీర్థో గరిష్ఠ ధీః ॥ ౯

సంపూర్ణచేతా స్త్వవతు మాం తథైవ మహామతిః ।
మహామానసమధ్వాచ పాలయేతాం తథైవ మాం ॥ ౧౦

తథా సంమోద తీర్థశ్చ పాతు మాం కృపయా సదా ।
హంసరా ట్చ సదావ్యాత్ ప్రమోద తీర్థ స్తథైవ చ ॥ ౧౧

సమగ్రధీ రార్యవర్యః సు చిత్తశ్చ సదావతు ।
విశ్వేశచేతా మాం పాతు చారు ధీ రన్వహం తథా ॥ ౧౨

కృతాంతవి త్తమః పాతు జగద్గురు ర్గురుశ్చ మాం ।
సంపూర్ణసంఖ్యో మాం పాతు మాం విద్యాధిపతి స్తథా ॥ ౧౩

మహామనా స్తథా పాతు మాఽవ్యాదప్యమందధీః ।
స్వానందతీర్థ స్త్వవతు వ్యాథహ్వాచ్చ తథైవ చ ॥ ౧౪

పాతు వి స్తృతచిత్తశ్చ శుద్ధ ధీశ్చ తథాఽవతు ।
పాలయేతాం త్రికాలం మాం సకలజ్ఞాయుత చేతసా ॥ ౧౫

పృథు ధీ రన్వహం సూరిమౌలిర్మాం సర్వదాఽవతు ।
అవ్యాత్పృథులచేతా మాం మాఽవ్యాత్సర్వవి ద్వతిః ॥ ౧౬

పూర్ణదృష్పష్టబుద్ధిశ్చ పాలయేతాం సదైవ మాం ।
మా విశంకట బుద్ధిశ్చ పాలయ త్వనుకంపయా ॥ ౧౭

మరుదంశో౽మందమనీషో౽ఘనాశన కీర్తిమాన్ ।
సదా౽ప్రచురధీః పాతు పురుసంఖ్యా స్తథైవచ ॥ ౧౮

మామదభ్రమనీషః పృషదధివాంశః సదా౽వతు ।
శుద్ధహ్యాన్మాం పాలయతూ త్తమ చిత్తా స్తథైవచ ॥ ౧౯

సద్గురు ర్వృజిననాశననామా౽౽ నంద ధీ స్తథా ।
పరిపూర్ణప్రమతి రప్యవ్యాన్మాం కృపయా సదా ॥ ౨౦

అవ్యాన్మహాధీ రమితప్రమతిః పురుధీ స్తథా ।
గురుమానసో౽ నంతహృదవ్యాన్మాం ఋజుపుంగవః ॥ ౨౧

అమితాంతరో౽వ్యాత్ప్రభూత ధీర్యాచరితరమానసః ।
అమరాది సద్గుణ శ్చావ్యా న్మా మవిరలాంతరః ॥ ౨౨

మాం మహాసుఖ తీర్థాశ్చ పాయాద్దుః ఖౌఘవారిధేః ।
విరలేతరాంతరః పాతు తథా ధీర మతిశ్చ మాం ॥ ౨౩

సౌఖ్యతీర్థః పాతుకలిః లోకనాయక ఏవ చ ।
ప్రాజ్ఞమౌలిమణిః పాతు తథాపృథుల మానసః ॥ ౨౪

సర్వధీః సతతం పాయా దలేశధీరపి మా౽వతు ।
పూర్ణసంఖ్యః పూజ్యచరణో దశప్రమతి రేవ చ ॥ ౨౫

సదా మాఽవ్యాద్బహుల ధీః పాతు మా విస్తృతాంతరః ।
మహిష్ఠ ధీ ర్విశ్వవేత్తా పాతు మా మనుకంపయా ॥ ౨౬

పరాత్మవేదకోఽ వ్యాద్వితాన చేతా స్తథైవ చ ।
పృథుప్రబోధో మాం పాతు మహిష్ఠహృదయోఽపిమాం ॥

మహీయా మతి రవ్యావ్యా ద్వృష్ణ వాగ్రేసరశ్చ మాం ।
జగదీశః పాతు మహాపురుషో త్తమదాసకః ॥ ౨౮

మాఽవ్యాచ్చ ధన్యప్రవరః ప్రాజ్ఞః పాత్వపిమాం సదా ।
అదీనసత్త్వో మాం పాతు తథానంత గుణాంతరః ॥ ౨౯

గురుప్రబర్హో మా మవ్యా ద్వ్యాస శిష్యశ్చ మాఽవతు ।
తథైవ మామజసమః పాయాద్ధ్వ స్త దురాగమః ॥ ౩౦

ఆయామాహృద్యోగ్యపి మాం పాయాద్విష్ణుసుహృచ్చమాం ।
పాయాత్సదామాం భువన విభూషణ ఇ తీరితః ॥ ౩౧

తథా మాఽవ్యాద్ధరి పదరతశ్చ ప్రచురాంతరః ।
భగవ త్తమశ్చ విపుల ప్రమతిశ్చ సదాఽవతు ॥ ౩౨

మహనీయపాద శ్చావ్యాన్మా మమానవకల స్తథా ।
పాయాన్మహానందతీర్థోఽ నంతస్వాంత స్తథైవచ ॥ ౩౩

వేదాంత సింహశ్చావ్యాన్మాం భూరిచి త్త స్తథైవచ ।
హర్షతీర్థః పాతుకవిః విద్వద్వర్య స్తథైవ చ ॥ ౩౪

ఉత్తమప్రీతితీర్థశ్చా చార్యవర్య స్తథైవ చ ।
గోవింద భక్తోఽప్యవ్యాన్మాం ధన్యబుద్ధి స్తథైవచ ॥ 3౫

ప్రాజ్యప్రజ్ఞోపి విస్తారబుద్ధి రవ్యాచ్చ సంకటాత్ ।
అవ్యాదగ్ర్యానందతీర్థో హర్యంశః సర్వవిచ్చ మాం ॥ ౭౬

అదభ్రధిషణోఽవ్యాదమితమతిపదోఽపి మాం ।
సదాగురుమతిః పాతు తథైవ పృథు దర్శనః ॥ 3౭

కృపార్ద్రమనసా సమ్యక్ పాతు ప్రాజ్ఞదివాకరః ।
పరమానంద సుతీర్థసూరి రాజ స్తథైవచ ॥ 3౮

ప్రతిరాజః ప్రాణపతిః శతసంఖ్య స్తథైవ చ ।
అవ్యాత్పురుమరత్నస్త్రి జగత్పూజ్యశ్చమాఽవతు ॥ 3౯

అనంతమానసోఽ వ్యాత్ప్రబర్హబోధ స్తథైవచ ।
గూఢదేవశ్చ మాం పాతు పరిపూర్ణమతిశ్చ మాం ॥ ౪౦

మా మవ్యాత్ప్రచరప్రజ్ఞో బహు బోధ స్తథైవచ ।
బహుప్రబోధశ్చావ్యా ద్దశ హృదయశ్చాపి మాఽవతు॥ ౪౧

ఉరుచేతాశ్చ పరమానంద తీర్థ స్త థైవ చ ।
బహులహృన్మాం కృత్య వేది ప్రవేశోఽవతు మాం సదా॥ ౪౨

విపులహృదయో మా మమృతాన్న సేవ్య స్తథై వచ ।
సహస్రప్రకాశోఽప్యవతు తథాపృథుమతిశ్చ మాం ॥ ౪3

అఖిలజ్ఞోఽపరిమితమసీమః పాతు మాం సదా ।
రక్షేత్త్వలవ బోధో మాం మాన్యధీ రన్వహం తథా ॥ ౪౪

సమధికధిషణోప్యధిక బోధ స్తథాఽవతు ।
సన్మతిమాంశ్చ ప్రచురతరఖ్యాన్మాం సదాఽవతు ॥ ౪౫

పాయా చ్చాధికధిషణ స్తథాఽతను మనాశ్చ మాం ।
పరిపూర్ణసంవి త్పాయాన్మాం భూయో బోధ స్తథై వచ॥ ౪౬

విశ్వజ్ఞశ్చ తథాఽఖండజ్ఞో విశ్వాభిజ్ఞ ఏవచ ।
అతుచ్ఛధిషణః పాయా త్పాయాచ్చక్రాయుధప్రియః ॥ ౪౭

భూయోధీశ్చ మహాచార్యా మారుతాంశశ్చ మాఽవతు ।
వేదవాదిరాట్సర్వేష్టోఽవ్యాన్మాం బ్రహ్మసమ స్త థా॥ ౪౮

శ్రీతీర్థశ్చ వేదాంత గురు రవ్యాచ్చ సర్వదా ।
పాయాత్సదాఽనంతమతిః పవనాంశ స్తథైవచ ॥ ౪౯

మహాబోధశ్చ కృత్స్నజ్ఞః సుచేతాశ్చ సదావతు ।
ప్రాజ్ఞోత్తమశ్చైవ వేదప్రవచనాచార్య ఏవచ ॥ ౫౦

అనంతబోధః పూర్ణేష్టోఽవ్యాన్మాం రామప్రియః సదా ।
సదర్చ్యోఽనూనబోధోఽప్యవ్యా ద్వితతమతి స్తథా ॥ ౫౧

ఉచ్చమానో మహేశశ్చ పాయాద్యతివరోఽపిమాం ।
సకలమతిశ్చ సర్వజ్ఞః (తథా) పరమ మతిశ్చ మాం ॥ ౫౨

విపులవ్యాప్తచ్ఛమాం పాయాత్స్వం పూర్ణప్రమతి స్తథా ।
అవ్రథసంఖ్యశ్చ తథా బృహద్ధీః శుచిహృత్తథా ॥ ౫౩

విశాలసంవిత్ప్రపూజ్య పూజ్యః ప్రచురతరాంతరః ।
తథైవోరుమతిః పాయాద్భవే స్మిన్ దుఃఖసాగరాత్ ॥ ౫౪

పాయాద్బృహత్ప్రబోధశ్చ భువనగురు స్తథైవ (చ) ।
తథైవ దశధిషణః ఆర్యవర్యస్సుపాలయేత్ ॥ ౫౫

తథాఽవిరలసంవిచ్చ జ్ఞానం దత్వాశు పాలయేత్ ।
మామవ్యాత్ప్రచురమనోంశాసోఽనిష్ట సాగరాత్ ॥ ౫౬

శ్రీమదానందతీర్థశ్చ దద్యాదిష్టం సదా మమ ।
సద్వ్యాఖ్యానప్రవాహం చ దత్వా మాం రక్షతు ధ్రువం ॥ ౫౭

ఇత్థం శ్రీమధ్వనామాని శ్రీమధ్వవిజయాచ్ఛుభాత్ ।
శ్రీనివాసే నోద్ధృతాని యాదవా చార్యసేవినా ॥ ౫౮

సప్తత్రింశో త్తర శత ద్వయ సంఖ్యా న్యలం నరః ।
మాంగల్యాద్యాహాది కృత్యేషు తథేతరశుభేషు చ ॥ ౫౯

త్రికాలేయః పఠేన్నిత్యం శుచి స్త ద్గతమానసః ।
ఐహికాముష్మికాన్కామాన్ స లభే త్తదనుగ్రహాత్ ॥ ౬౦

ఇతి శ్రీ యదుపత్యాచార్య పూజ్యపాదారాధక వేణుపల్లి శ్రీనివాస విరచితా మధ్వనామావలిః సమాప్తా.

శ్రీకృష్ణార్పణమస్తు

# మధ్వ నామావళి

ఓం శ్రీ మధ్వాచార్యాయ నమః
వాసుదేవాయ
అమానవ నవాకృతయే
విష్ణుదాసాయ
హరిపదాయ
పృథు ధియే
వసుదేవ సుతాహ్వయాయ
చతురధియే నమః
త్రిజగద్గురవే
భువనభర్త్రే
ద్విజకుమారాయ
ఛలమానుషాయ
గురవే
ద్విజమానవే
త్రిభువనగురవే
జగద్గురవే
విభవే
విశ్వవిదే
అలయబుద్ధయే
పూర్ణ బోధాయ
మహామతయే
భూరిచేతసే
పూర్ణబుద్ధయే
మహాత్మనే
పూర్ణధియే
ప్రభవే

ఓం శ్రీ మహాప్రాజ్ఞే నమః
భూరి ప్రాజ్ఞే
అమిత బుద్ధయే
అదభ్ర చేతసే
ఆనందతీర్థాయ
గురుబుద్ధయే
అఖండధియే
అనుమానతీర్థాయ
సుఖతీర్థాయ
గరిష్ఠధియే
పూర్ణచేతసే
బృహన్మతయే
మహామానసాయ
మధ్వాయ
సంమోదతీర్థాయ
హరిసద్రాజాయ
ప్రమోదతీర్థాయ
సమగ్రధియే
ఆర్యవర్యాయ
సుచిత్తాయ
చారుధియే
కృతాంతవిత్తమాయ
జగద్గురవే
సంపూర్ణసంఖ్యాయ
విశ్వైకచేతసే
విద్యాధిపతయే

ఓం శ్రీ మహామనసే నమః
అమందధియే
స్వానందతీర్థాయ
వ్యూఢహృదే
విస్తృతచిత్తాయ
శుద్ధధియే
సకలజ్ఞాయ
అలయచేతసే
పృథుధియే
సూరిమౌలయే
పృథులచేతసే
సర్వవిదే
యతయే
పూర్ణదృశే
పుష్టబుద్ధయే
విశంకటబుద్ధయే
మరుదంశాయ
అమందమనీషాయ
అఘనాశనకీర్తయే
ప్రచురధియే
పురుసంఖ్యాయ
అదభ్రమనీషాయ
వృషదధివాంశాయ
శుద్ధహృదే
ఉత్తమచిత్తాయ
సుదుర్గవే
వృజిననాశననామ్నే
అనందధియే

ఓం శ్రీ పరిపూర్ణప్రమతయే నమః
మహాధియే
అమితప్రమతయే
పురుధియే
గురుమానసాయ
అనంతహృదే
ఋజుపుంగవాయ
అమితాంతరాయ
ప్రభూతధియే
భూరితరమానసాయ
అమరాదిసద్గణాయ
అవిరలాంతరాయ
మహాసుఖతీర్థాయ
విరళేతరాంతరాయ
ధీరమతయే
సౌఖ్యతీర్థాయ
కవయే
లోకనాయకాయ
ప్రాజ్ఞమౌలిమణయే
పృథులమానసాయ
సర్వధియే
అశేషధియే
పూర్ణసంఖ్యాయ
పూజ్యచరణాయ
దశప్రమతయే
బహులధియే
విస్తృతాంతరాయ
మహిష్ఠధియే

ఓం శ్రీ విశ్వవేత్రే నమః
పరాత్మవేదకాయ
విశానచేతసే
పృథుప్రబోధాయ
మహిష్ఠవ్యాదయాయ
మహీయోమతయే
వృష్ణవాగ్రసరాయ
జగదీశాయ
మహాపురుషోత్తమదాసాయ
ధన్యప్రవరాయ
ప్రాజ్ఞాయ
అదీనసత్వాయ
అనంతగుణాంతరాయ
గురుప్రబర్హాయ
వ్యాసశిష్యాయ
అజసమాయ
ధ్వస్తదురాగమాయ
అయాథవ్యాదే
యోగినే
విష్ణువ్యాదే
భువనవిభూషణాయ
హరిపదరతాయ
ప్రచురాంతరాయ
భగవత్తమాయ
విపులప్రమతయే
మహనీయపాదాయ
అమానవకలాయ
మహానందతీర్థాయ

ఓం శ్రీ అనంతస్వాంతాయ నమః
వేదాంతసింహాయ
భూరిచిత్తాయ
హరతీర్థాయ
విద్వద్వర్యాయ
ఉత్తమప్రీతితీర్థాయ
ఆచార్యవర్యాయ
గోవిందభక్తాయ
ధన్యబుద్ధయే
ప్రాజ్యప్రజ్ఞాయ
విస్తారబుద్ధయే
అగ్ర్యానందతీర్థాయ
హర్యంశాయ
సర్వవిదే
అదభ్రధిషణాయ
అమితమతిపదాయ
గురుమతయే
పృథుదర్శనాయ
ప్రాజ్ఞదివాకరాయ
పరమానందసుతీర్థమహారాజాయ
వశిరాజాయ
ప్రాణపతయే
శతసంఖ్యాయ
పురుమతత్త్వాయ
త్రిజగత్పూజ్యాయ
అనంతమానసాయ
ప్రబర్హబోధాయ

ఓం శ్రీ గూఢదేవాయ నమః
పరిపూర్ణమతయే
ప్రచురప్రజ్ఞాయ
బహులబోధాయ
బహుళప్రబోధాయ
దశహృదయాయ
ఉరుచేతసే
పరమాగ్ర్యానందతీర్థాయ
బహులహృదే
కృత్స్నవేదిప్రవేశాయ
విపులహృదయాయ
అమృతాన్నసేవ్యాయ
సహస్రప్రకాశాయ
పృథుమతయే
అఖిలజ్ఞాయ
అపరిమితమనీషాయ
అలవబోధాయ
మాన్యధియే
సమధికధిషణాయ
అధికబోధాయ
సన్మతిమతే
ప్రచురతరహృదే
అధికధిషణాయ
అతనుమనసే
పరిపూర్ణసంవిదే
భూయోబోధాయ
విశ్వజ్ఞాయ
అఖండజ్ఞాయ

ఓం శ్రీ విశ్వాభిజ్ఞాయ నమః
అతుచ్ఛధిషణాయ
చక్రాయుధప్రియాయ
భూయోధియే
మహాచార్యాయ
మారుతాంశాయ
వేదవాదిరాజే
ఉర్వీశాయ
బ్రహ్మసమాయ
ప్రీతితీర్థాయ
వేదాంతగురవే
అనంతమతయే
పవనాంశాయ
మహాబోధాయ
కృత్స్నజ్ఞాయ
సుచేతసే
ప్రాజ్యేశాయ
వేదప్రవచనాచార్యాయ
అనంతబోధాయ
పూర్ణేశాయ
రామప్రియాయ
సదర్చ్యాయ
అనూనబోధాయ
వితతమతయే
ఉచ్చమానాయ
మహేశాయ
యతివరాయ
సముదితమతయే

ఓం శ్రీ సర్వజ్ఞాయ నమః
పరమమతయే
విపులహృదే
సంపూర్ణప్రమతయే
అదభ్రసంఖ్యాయ
బృహద్ధియే
శుచిహృదే
విశాలసంవిదే
ప్రపూజ్యపూజ్యాయ

ఓం శ్రీ ప్రచురతరాంతరాయ నమః
ఉరుమతయే
బృహత్ప్రబోధాయ
భువనగురవే
దశధిషణాయ
ఆర్యవర్యాయ
అవిరలసంవిదే
ప్రచురమనోవిలాసాయ
శ్రీమదానందతీర్థాయ